శ్రీమత్పరదేవతాయైనమః.

# ప్రణయసౌరభము.





రచయితలు:

కొండపల్లి గోపాలరావు,

హరి రామలింగశాస్త్రి.

# విజ్ఞప్తి.

---

ఉ॥ ఎందును లేవు పూర్వకవు ♦
లేఁగని తోఁవలు సత్కవిత్వని
ష్యందిమరందధారలు ర♦
సావహముల్ త్రిపురాసురారిమౌ
ళీందుకలాభిషిక్తము ల♦
హీనము లయ్యవి లేమి గ్రంథముల్
పెందున లోకమాన్యత, రు♦
చించున కావ్యరసజ్ఞపాళికిఁ ?

ఇట్లు,

—కృతికర్తలు.

శ్రీమత్పరదేవతాయైనమః

# ప్రణయసౌరభము.



శ్రీ రమణీయనేత్ర సర♦సీజయుగం బుపలక్ష్యమాణరా
గారుణమై తలిర్పఁ బ్రణ♦యాకృతిఁ బూని మహేశునంకముం
జేరి సుఖించు మంగళ య♦శేషశుభప్రతిపాదదృష్టిఁ గా
భ్యారుమహాన్వయుఁ సుగుణ♦లోలుని బ్రోచుత రాజరాణ్ణృపున్.

గీ॥ అంతరాయాంధకారోప♦శాంతికరుఁడు
గండతలసారిమదజల♦కణచయుండు
గజముఖుఁ డభీష్టదుఁడు ప్రోచు♦గాత జోగ
రాట్తనూజుని రాజేశ♦రాయు నెపుడు.

సీ॥ పరిపంథికవిగర్వ♦పాథోధిబాడబ
శక్తి నే మాతృక ♦ సంతరించె
తీవిపై గండపెం♦డేరమ్ములను పద
మ్ములకుఁ గైసేసె నే ♦ పూవుఁబోడి

శతవధానకవిత్వ♦సామ్రాజ్యసింహాపీ
ఠంబు నెక్కించె నే♦కంబుకంఠి
సంతుష్టచిత్తర♦సానాయకులచేత
బిరుదు లిప్పించె నే♦బిసరుహాక్షి

గీ॥ సరసనన్నయముఖకవీ♦శ్వరుల కావ్య,
తద్వచఃకాంత, అమలినో♦దారచిత్త,
పరమకవితాభిమానసం♦పద నొసంగి
రామయోగాప్రత రాజేశ♦భామినిజాని.



# నతి.

చం॥ సరసకవిత్వతత్త్వవిల♦సన్మతి నాంధ్రధరాధినాయకో
త్కరపరిషత్సుధీవినుత♦కమ్రయశస్తరుణీవిలోలు సుం
దరరసభావగుంభితవ♦ధానవిధానధురీణు వేంకటే
శ్వరు గురు౯ జెళ్ళపిళ్ళకుల♦చంద్రు భజింతుము వాగ్విశుద్ధికై.



# కృతిపతి.



ఉ॥ రుద్రసమర్చనానియమ♦రూఢుఁడు సారసబాణసన్నిభో
న్ముద్రమనోజ్ఞమూర్తి కవి♦పుంగవనేత్రచకోరచంద్రుఁ డా
ర్ద్రప్రవసంతుఁ డర్థిజనపాలన♦సద్వ్రతుఁ డంబురాశిని
ర్నిద్రగభీరుఁ డొప్పు నవ♦నీస్థలి మాకృతినాథుఁ డున్నతిన్.

ఉ॥ అన్యతటిల్లతాంగులము♦ఖాంబుజముల్ పరికింపఁబోఁడు సౌ
జన్యగుణప్రధానుఁడు ర♦సాపరిపాలనకౌశలుండు రా
జన్యకమంత్రిసత్తముఁడు ♦ శాస్త్రవివేకధురీణుఁ డార్యస
న్మాన్యుఁ డస్మదీయకృతి♦నాథుఁడు పొల్పుధరాతలంబునన్.

మ॥ శరవిద్యానిపుణుండు పద్మభవవం♦శక్షీరవారాశిచం
ద్రుఁడు న్యాయకళాప్రబోధనసము♦న్మేషాంతరంగుండుని
ర్జరభూజప్రసవప్రసారిమధుధా♦రామాధురీమాధురం
ధరవాగ్ధోరణియైన మాకృతిపు నె♦న్నన్వచ్చు రాజేశ్వరున్.

మ॥ సరస స్తవ్యకళావధానకవితా♦సౌభాగ్యసంభాసి భా
స్వరబంధ్యాల మహాన్వయ ప్రథితసు♦బ్రహ్మణ్యసద్దేశికో
ద్ధురకారుణ్యకటాక్షలబ్ధకవితో♦ద్యోగైకలోలుఁ డాయుగం
ధరబుద్ధిప్రతిభాప్రభావిభవు నె♦న్నవ్వచ్చు రాజేశ్వరున్.

చ॥ సకలదిగంతసంస్థకలి♦సత్తమశాతరదామలాంశుమా
లికలను మల్లికా స్తబక♦రేఖల శారదపూర్ణచంద్రచం
ద్రికలఁ ద్రిమార్గగోర్మివిత♦తిన్ బరిహాసము సేసిపొల్చుమా
మత్కృతినాయకావనిపు♦ మంజులకీర్తిరుచిప్రకాండముల్.

క॥ ఏతాదృశగుణనిధి కం
జాతరుణీచిత్తపద్మ♦భాస్వంతునకున్
శీతలదృష్టికి నార్త
త్రాతకు కాభ్యారివంశ్య♦రాజేశునకున్.

గీ॥ భ్రాతృహిత గౌరవము దేట♦ పఱుపనెంచి
అంకితముగాగ మేము వ్రా♦యంగడంగు
ప్రణయసౌరభనామ కా♦వ్యంబునందు
కల్పనాచిత్రమై యిట్లు♦ కథ చెలంగు.

శ్రీ

# ప్రణయసౌరభము.

## ప్రథమ వీచిక.



ఇరుకెలంకుల లతా◆ధరణీరుహావళి
  విరుల రాల్చి బరా◆బరులు సేయఁ
బలువింత వన్నెలఁ ◆ జెలువారు పులుఁగులు
  జలవిహారైకవాం◆ఛలఁ జెలంగ
నలసానిలము వీవఁ ◆ జెలరేఁగి నటియించు
  తరఁగమొత్తములు పెం◆పారువుఁ గూర్ప
నందందు గఱకురా ◆ లవరోధ మొనరించి
  కలగానరావసం◆గతినిఁ గూర్ప
గీ॥ జలచరంబులు రేఁగి యొ◆ప్పాలను జిమ్మ
  పూఁబ్రొటోడల ముంపఁ ద◆త్పుష్పరజము
  గలియ మధురంబులై శుభ్ర◆జలము లలరఁ
  బాఱుఝర మొక్కటి పరోప◆కారి యగుచు.

ప్రణయసౌరభము.

గీ॥ తద్ఘనతటాంతిక సమాన • తలమునందు
చండకరచండకిరణ తై • క్ష్ణ్యప్రరోధి
గుల్మినీశాఖిరాజి సం • కులవిలాస
కాననం బొప్పు వితతమా • ర్గములఁగల్గి.

సీ॥ మాతులుంగలవంగ • [illegible]కంద జంబీర
ఖర్జూర కదళికా • క్రముక చయము
నారికేళామ్రము • నారంగ పున్నాగ
చంపక దేవకాం • చన చయమ్ము
దేవదారుపటీర • దేవతాళాశోక
నాగరాశ్వత్థ హిం • తాలచయము
మాలతీతూలక • కోలనాగసుగంధ
లుంగ కదంబ మా • లూరచయము

గీ॥ మల్లికాహిజ్జలతమాల • మంజులమ్ము
పారిజాతనింబమహిళా • భాసురమ్ము
దేవవల్లభ నాగినీ • భావుకమ్ము
ఘనతరోద్యానవనము వీ • క్ష్యమ్ము నగము.

ప్ర థ మ వీ చి క ,

క॥ అంపఁ బ్రసూనోత్కరని
ష్యందన్మకరందబిందు ♦ సందోహమ్ముం
బొందిన యిందిందిరములు
సందడిఁగావించు మిగుల ♦ ఝంకృతు లొలయన్.

గీ॥ అంత మధుమాస మవ్విపి♦నాంతరమున
భాసురంబయ్యెఁ సుమనోవి♦కాసమయ్యెఁ
గాంధజనము ల్తదీక్షుని♦శ్వాసమయ్యె
కోకిలకంఠకంఠనాదం♦కారమయ్యె.

మ॥ అలినీజాలము కుంతలమ్ములయి సొం♦పారంగ, గుచ్ఛంబులు
జ్జ్వలవక్షోజములై చెలంగఁ జివురు ♦ ల్పాదంబులై యొప్ప, నం
చలయానంబులు మందమందగతులై ♦ జానొప్ప వాసంతికా
జలజాతాక్షి వరాంగసౌష్టవము బె ♦ ల్పన్దాల్చె నప్పట్టునన్.

సీ॥ పల్లవసంతాన♦భాసిసర్వాంగసహో
జాతముల్ దర్శక♦జనముగాఁగ
అభినవరాగబీ♦జాభివిన్యాసకుం
డిక్షుధన్వుఁడు పురో♦హితుఁడుగాఁగ

ప్రణయసౌరభము.

సర్వజనాభిరం♦జకరూప మాధవ
వన్యలక్ష్ములు సుదం♦పతులుగాఁగ
ప్రసవపరాగైక♦రంగవల్ల్యభిరామ
ఘనభూధరము సుఖా♦సనముగాఁగ

గీ॥ వరఖగార్భటి స్వస్తిని♦స్వనముగాఁగ
భ్రమరఝంకృతులమల♦వాద్యములుగాఁగ
అలిమనోహరసుమము ల♦క్షతలుగాఁగ
ఉరుముదము గూర్చు వైవాహి♦కోత్సవంబు.

సీ॥ అనుఁగు నెచ్చెలియతో♦ నలుకఁ బూనిన నాథుఁ
డనురక్తిఁ బూర్వ స♦ఖ్యంబు నొందె
ఎదముగం బిడి "నన్నుఁ♦ బీడింపకుం"డను
మగువ తా బ్రతిమాలి♦ మగని గూడె
తాత చెందిలి యన్న♦ తనపాత్రికను గాంచి
"నా కెవ్వ రిత్తురే♦ నాతి" యనియె
మొదిపండులు వోలె♦ మిసిమించు జారకాం
తాజనంబునకు ధ♦నంబుగలిగెఁ

ప్రథమవీచిక.

గీ॥ బాలురెల్లరు బెండ్లిసం♦భావనలకు
పాలుచుండిరి కడుచిన్ని♦బాటలందు
నెల్లజనులమనంబులు ♦ వల్లవించ
పరమముద్దాయిమాధవీ♦వాసరముల.

క॥ అట వికచకుముదజలరుహ
పటలవిరాజితము చక్రి♦వాకాదిఖగ
స్ఫుటరావముఖరిత మ్మగు
తటభాసిజలాశయంబు ♦ తద్దయు బొల్చెన్.

ఉ॥ అక్కనమాఱు నందజము ♦ లంబువిహారమునందు దీవలం
జక్కఁగ దిద్ది యావలకు ♦ సాగి ప్రదక్షిణ మాచరించుచున్
జెక్కుల నీరముం జిలుక♦రించుచు మాటికి లేచి దవ్వునం
దొక్కటిగాగ వ్రాలి నయ♦నోత్సవమున్ బొనరించుచుండెడిన్.

గీ॥ ఉపలసంచయసంఘటి♦తోరువేది
కాద్వయోపరిసంస్థాపి♦తాద్వితీయ
నీరయంత్రంబు కాసార♦నీరములను
నిత్య మిడుచుండు వనధర♦ణీజములకు.

ప్రణయసౌరభము.

మ॥ అనవద్యాకృతి యవ్వనుండొకఁడు మే♦ఘానీకసంవ్యాప్తమై
ఘన ఘోషుండలమో యనంగ గురుసం♦తాపాతిరేకంబుచేఁ
దనచిత్తంబు కళంకమై యుపగతో♦త్సాహంబునై యొప్ప నా
ననశీతాంశువు ఖిన్నమై వెలయఁ జెం♦తన్ వన్యమార్గంబులన్.

గీ॥ సంచరించుచు దీర్ఘని♦శ్వాసములను
సముథితోష్ణంబుల నిగుడ్చు♦ జటిన గాలులయుఁ
గూరుచుండును లేచు సం♦కుచితచిత్త
గతులకుం జిక్కి మిగులఁ జీ♦కాకుపడును.

ఉ॥ చెక్కటఁ జేయిఁజేర్చి యొక♦చిత్తరువై తనరారి జవ్వనుం
డక్కనుదోయికోనల ని♦రంతరబాష్పజలంబు నింపు న
ల్దిక్కుల వింతవింతగ చ♦లించెడి చూడ్కులఁజూచునంత పెం
పెక్కిన కో♦లార్భటి స♦హింపక సొక్కి విరాళి నిట్లనున్.

గీ॥ ప్రకృతిపై చిత్రవైభవో♦ల్లసితమంజు
ఫాల్గుణోద్యానవనరసా♦లావనీజ
పల్లవంబులఁ గుత్తుక♦బంటి మెసవి
తరుణవిరహులశ్రవణభే♦దకముగాగ

## ప్రథమ వీచిక.

ఇంటఁదిని యుంటి నానంబు ♦ లెంచు పగిది
కోకిలా! యేల వదరెదు ♦ కొసరికొసరి
క్షేమసందేశభావనో ♦ త్కృష్టమైన
నీదు కలకూజితంబు ని ♦ ర్ణిద్రమధుర

గణ్యమై తోచు నీప్రియాం ♦ గనకు గాని
అతిభయంకరశరనిపా ♦ తాభమగుచు
నాశ్రవఃపుటయుగళిని ♦ నాఁటుచుండె
గోకిలా! యేల క్రోల్చెదు ♦ కొసరికొసరి

నీకృతఘ్నతాఘోరాఘ ♦ నీరదంబుఁ
బాఱదోలఁగ భూరిప్ర ♦ భంజనాభ
మగునను వుణ్యదంబయి ♦ యలరుచుండు
నది యనుష్ఠేయమగు నవ ♦ శ్యంబు నీకు

వదరు టుడుగుము నామాట ♦ పాటిజేయు
మదను చెడునేని పొనరింప ♦ నలవిగాదు
యయది గామానువిద్ధమే ♦ యగును పికమ!
కుతికఁ గుదిలించి యేల వ్యా ♦ కులత గాంతు.

ప్రణయసారథము.

ఉ॥ పాడెదవేల? నేఁ బలుకు ♦ పల్కులకున్ నిలువంగలేని యే
భారము నీకుఁ దోఁచె వల♦వంతకు చిక్కిన మన్మనంబు ను
ద్ధారణ సేయవేల? పర♦తం గను లెఱ్ఱగఁ జేసెదేల? హుం
కారము మానవేల? చెడు♦కాలముఁ బొందెదవింక కోకిలా!

గీ॥ పోవుదారిని పోక బ♦ల్లొంగి పికము!
మాధవిన్ వ్రాలి యుండు ద♦న్మధువుఁ గ్రోలు
మధుపముల కేవు లేటిధ♦ర్మము? మదీయ
మానపాపులుగావె త♦న్మధుకరములు?

ఉ॥ పోలదు తేటులార! బలి♦భుక్పరివర్ధితమైన కోకిలం
బోలిమ వ్రాద్ధతింగనఁగఁ♦బోకలుమానుఁడుపొంగడంచిమీ
వేల పతిక్రమింపకుఁడు ♦ వీనులవ్రీలుచు భూరిఝంకృతిన్
గ్రోలుదుఁ దేనె డింక ప్రతి♦కూలవుసంపఁగితావులొప్పెడిన్.

మ॥ సకలోన్మీలితసారసౌరభరజ♦స్సంభారియై మల్లికా
ప్రకరోద్భిన్నలతాంతగుచ్ఛకవిహా♦రప్రౌఢుఁడై దండధా
రకశుద్ధాంతనితంబినీమకరికా♦లంకారసౌగంధ్యలుం
ఠకుఁడై పయ్యెర వచ్చె చంపకసుగం♦ధప్లావితాకారుఁడై.

ప్రథమ వీచిక.

గీ॥ అకట! పాంథాభిమానాంశు ♦ రాళి మెసవు
మలయపవమానుఁ డేడ, యీ ♦ మాటమేడ
నాకు ననుకూలుఁ డౌ టేడ ♦ జోక యేడ?
యనుచు వలవంతఁ దూలిన ♦ యంతలోన.

గీ॥ పొడుపుకడయందు పొడసూపె ♦ నిడుదలగుచు
తరుల నీడలు, జెందమ్మి ♦ తళుకు మీఱె
వరుణకకుబంతరమ్మున ♦ వాడి వ్రేలు
తరుణలతికలు దలిరించి ♦ తలల నెత్తె.

చ॥ కలకలకూయుచున్ ద్విజని ♦ కాయములంబరవీధిఁ బారెడోఁ
కల నిలువెత్తి లేఁగలను ♦ గాంచెడి కోరిక తత్తరింప కా
లలకయి గోవు లేగెను, పొ ♦ లమ్ముల వీడి కృషాణులిండ్లకున్
వెలలిరి, భానుఁ డస్తధర ♦ ణీధరకూటమునందు నిల్వఁగన్.

గీ॥ మధురసాస్వాదనాసక్త ♦ మధుపకలిత
జలరుహాంబులు జెన్మ్భాత ♦ ములు వసించు
శిథిలనిలయంబులో యునఁ ♦ జెన్నుఁ దొరఁగ
లోకబాంధవుఁ డపరాబ్ధి ♦ లోనఁ గ్రుంకె.

ప్రణయసౌరభము.

గీ॥ తింత్రిణీదళాళములు నిద్రితము లయ్యెఁ
దంటియముల దళంబుల తళుకు దొరఁగ
నిద్రికర్ణిక వడివాడి నిదురఁబోయె
వనజబాంధవుఁ డపరాంబుధిని మునింగె.

గీ॥ బొద్దుతిరుగుడు చెట్టుల బొంత ముడిగ
రాణకుం దూరమైన రేరాణు లలరెఁ
దిగ్వధూమణి తుదికార్యదీప్తి యనఁగ
సంజకెంజాయ లాగి నాకసమున నిండె.

గీ॥ నళినసూత్ర్యండపేటికాంతరమునందు
కపురపుంబల్కు లనగ ఋక్షములు వెలసె
సూచికాభేద్యమై గొయిరుఁ జూడనీక
కటికచీకటి క్రిమ్మె నల్గడలయందు.

గీ॥ భువనవిచిత్రమ్ము ప్రకృతిరంగస్థలమున
వింతదైవంబు తెరలను విడుచుచుండె
నవుడు "గనరాడె నామిత్రుఁడైన"వనుచుఁ
గలయఁ గన జవ్వనుఁడు ప్రాచిఁ జెలువు తోఁచె.

ప్రథమపీఠిక.

గీ॥ లలి గులాబిపూఁదేనుల • రంగుమీఱి
కైరవాప్తబింబ మా•కాశవీథి
నంద మలరార నొయ్యన • నవతరించె
జారచోరమనంబులు • ఝల్లు మనియె.

ఉ॥ కైరవషండముల్ విమల•కాంతిఁ దలిర్చెఁ జకోరపాళి పెం
పారఁగఁగ్రోలెఁ దత్కరచ•యంబు దమంబు గుహాంతరస్థలిం
జేరెను, రాగిఁ జంద్రు సర•సీజహితుండను శంకఁ గాంచి పొం
గారె నిమేషమాత్ర విర•హవ్యథఁ గ్రాఁగిన చక్రవాకముల్.

గీ॥ అంబుజాక్షుఁడు పశ్యతో•హారుఁడుగాన
వ్రజయువతులెల్ల నాకాశ•భాండమందు
నేరు పొలయు దాచిన నవ•నీత మనఁగ
గగనతలమున వెలుగొందెఁ • గడలివెన్న.

గీ॥ సాంద్రచంద్రిక మించి స్వ•చ్ఛందధవళ
కాంతి జగతిని వెలిజిమ్మె, • క్ష్మారుహముల
ఛాయలొప్పెను గుమురులై • జవ్వనుండు
వంత పొంపొందఁ గాంచి యా • ప్రాంతమందు.

పరిణయసౌరభము.

ఉ॥ తావుల నుల్లసిల్లెడు ల♦తాసదనాంతరసీమఁ జొచ్చి, య
త్తావునఁ బుష్పపల్లవవి♦తాన మమర్చిన సెజ్జపైనఁ జిం
తావిలమానసాంబురుహు♦డై పవళించి శరణ్యమెంచి నా
నావిధమంజువాక్యరచ♦నాచణచాతురి తోఁచునట్లుగన్.

"మ॥ అలఘూద్బోధకుఁడైన దేశికుని వ్యా♦హారంబుఁ బాటించి ని
శ్చలభక్తిన్నిరతంబు నిన్గొలుచు నన్ ♦శాసించ దే? త్వద్దయా
సలిలమ్ముం గురిపించి మామకమహా♦సంతాపదావాగ్నికీ
లల నార్పంగ నశక్తవే తెలియవే♦లా? రాజరాజేశ్వరీ!

మ॥ తలఁపుల్గల్గ వెమున్ను నీకరుణ స♦ద్ధర్మానుకూలంబులై
ఫలవంతంబులునై యశస్కరములై ♦ ప్రజ్ఞాప్రదీప్తంబులై
వెలయన్ లేదె యిదేలయీపగిది న♦న్వేధించు నీయూహ చే
తులకోడించెద నాయభీష్ట మిదు తో♦డ్తో రాజరాజేశ్వరీ!

మ॥ అవధానంబిసుమంత లేక యొగియూ♦హాల్పత్వ గల్పించియం
దవరోధించెద వాచరించుతటి యం♦దర్థంబు, శేషంబునం
దు విశేషంబు ఫలింపజేయవు దలం♦తున్ దీనికి న్హేతువా
భవదుద్బోధ మలంఘనీయమని యం♦బా! రాజరాజేశ్వరీ!

ప్రథమవీచిక.

మ॥ జతనంబుం బొనరించి మోదఫలవాంఛల్మాని నాంతర్యవా
క్త్రతినావిష్కరణంబు జేసి ఘనశాంతప్రాప్తిక్త మార్గంబునన్
స్తుతిఁ జెప్పం త్రి రచించు నన్ను కృతికృత్యమ్ముం జేయ శకించు త్వ
న్నతి నే నెట్లు లెఱుంగుదుం దెలుపుమమ్మా? రాజరాజేశ్వరీ!

మ॥ అని చింతించుచునుండ జవ్వనుని సంతాప్తిజ్ఞంబులన్నిదప్రియొ
య్యాన నీహారసమానమై తనరె భారాధిక్యముం బొందుటం
గను తెప్పల్ ముకుళించెఁ జేష్టలుడిగెన్ గాఢాతినిద్రాప్తిమా
నన తారాధ్యమునందు ప్రక్కటి సెంతన్నత్వంబుఁ బోకార్పగన్.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీమత్పర దేవతాయైనమః.

# ప్రణయసౌరభము.

## ద్వితీయ వీచిక.



ప్రథితగారుడమంత్రా ♦ క్షరముల వినికి
పాములకు వోలె తస్కర ♦ వల్లవులకు
కొక్కొరోకోయి యనియెడు ♦ కూత లంత
వినఁగనయ్యెను వేకువ ♦ వేళ యయ్యె.

సీ॥ పండువెన్నెల పటా ♦ పంచలై పరువెత్తె
సాంధ్యరాగము నభ ♦ స్థ్సలము నలమె
నండజంబులు కులా ♦ యమ్ముల విడనాడి
రొలుఁగించుచు న్నింగి ♦ నెఱకుఁ బాఱె
దీపికాతారకో ♦ ద్దీప్తి వెల్వెలబాఱ
నలుదెస లలనల్ల ♦ తెలివి మీఱె
జలజషండంబు రే ♦ కుల విచ్చి మిసిమీఱె
జక్కవల్ కవగూడి ♦ సంతసించె

## ద్వితీయవీచిక.

గీ॥ కైరవంబులు వాడెఁ, జ♦కోరచయము
గలఁతఁ జెందెను, నేలఱేం♦గులను తలల
ముసుంగులం బెట్టి పల్లవుల్ ♦ పసఁదొరంగి
పయనమై సందుగొందులం ♦ బాఱె రవుదు.

చ॥ అసమశరప్రతాప మన♦లంబె, గళత్కబరీవిశీర్ణముల్
బ్రసవవితానముల్ దళిత♦లజ్జలు విశ్లథనీవిబంధలుల్
బిసరుహలోచనల్ తుఱిమి♦వేఁకువ మేల్కొను భర్తృనేత్రసా
రసములకున్ మహాచ్ఛదన♦రాజి నొసంగి రెసంగు వేడుకన్.

గీ॥ సప్తపాథోధినాథది♦శావిశాల
పయనఁ గదియంగ రాగియై ♦ నళినవైరి
తరలె, దుబుదుక్కవాండ్లు 'శాం♦కరి మదంబ'
యనుచు భిక్షార్థ మరిగి ర♦య్యాదసునఁడు.

గీ॥ నముచిసూదనహరిదంగ♦నామతల్లి
నాసికాంచలకలితమౌ ♦ నత్తునాఁగ
విప్రసత్తము లర్ఘ్యము ♦ లీయుచుండఁ
దామ్రవర్ణపరిపూర్ణుండు ♦ తరణి తోఁచె.

పరిణయసౌరభము.

గీ॥ సంజకెంజాయ విడి నింగి ♦ స్వచ్ఛమయ్యె
లోకబాంధవుఁ గని పాంథ♦లోక మరిగె
క్షిప్రగతి, వారియెడల, తా♦కినశరీర
సంధుల నహార్కరుచులు భూ♦షలుగ నదికె.

సీ॥ కోదమతుమ్మెదదిమ్ము ♦ నదలించు కురులపై
నవ్యశిరోవేష్ట♦నము ధరించి
విపులరేఖాత్రయా♦విలసితనిటలమ్ము
నను విభూతిని నేరు♦పునను బూసి
లలితపల్లవపేశ♦లంబైన పాణియు
గ్మమునందు ఛత్రదం♦డములఁ బూని
ఆ॥ నవశిరీషసుమాభ ♦ నవఘుళించు పదంబు
లకు చిత్రమైన పా♦దుకలఁ దొడిగి

గీ॥ సారెకును ఘర్మబిందుసం♦చయము వొరల
నఖముఖమ్ములఁ దన్మార్జ♦నంబుఁ జేసి
వెనుక మరలింపఁబోని దృ♦ష్టిని నిగుడ్చి
బాటఁ జనుచుండె నవుడొక్క♦బాటసారి.

## ద్వితీయ వీచిక.

గీ॥ కనుబొ గనుబొనఁ బెనుచక్కఁ♦దనము వెలయ
మధ్యమున నిరుపార్శ్వంబు♦లందు మిగుల
దట్టముగ నల్లుకొని భీతి♦దంబులైన
వాయుముఖరితప్రోత్తుంగ♦వంశములను.

గీ॥ పవలఁ బెనుగొండచరియలఁ ♦ బవ్వళించి
రేల నెలుగులు బయలఁ బి♦పీలికలను
మెసవఁ బడగొట్టినట్టి వ♦ల్మీకములను
తచ్ఛితనఖాంకురవిముద్రి♦తముల గముల.

గీ॥ పొంచి పరికించు గోమాయు♦వులను గాంచి
కనుల రక్తంపుజీఱలు ♦ గ్రమ్ముకొనగఁ
జెవుల సారించి చెంగున ♦ జెలికలందు
చంగలించుచు పరువెత్తు ♦ శశకచయము.

గీ॥ తలిరుసొంపమ్ములకు గమ్మఁ♦దనముఁ బెంచి
తలిరుదిండులకైన విం♦దుల రచించి
పూఁవుగుత్తులఁ గమ్మతా♦వులను జిమ్మ
సహజసౌందర్యరాశి ర♦సాలరాజి.

పరిణయసౌరభము.

గీ॥ ఖురవిఘట్టనధూతధూ♦సరపరాగ
మొగసి తనువులఁ గప్పంగ ♦ నిట్చరఁవుయు
గంబాళం డిట్టలంబు కి♦న్కను వహించి
రంకెలు పరిధ్వనింపఁ బో♦రాడుచుండ.

గీ॥ అఖిలధర్మకార్యాచర♦ణాభిలోల
చిత్తమై సర్వలోకంబు ♦ చెలఁగుచుండఁ
దొలకరించెను పుడమిపై ♦ మొలకలెత్తి
రాణఁదనరారె దూర్వాంకు♦రంబు లపుడు

హారితవర్ణపరిపూర్ణయై ♦ యవని తోఁచె
శ్రివణముల నిక్క చెలఁగి పు♦చ్ఛములతోడ
మునురుకొను కీటకంబుల ♦ విసరుకొనుచు
ముందు పరికించుచుఁ శృంగ♦ముల నిగిడ్చి

మూపురంబుల వంచి పె♦న్బున లెసంగ
బలబలీవర్దచయము ద♦త్పరత మేయు
చిట్టుసొబగారు పచ్చని ♦బీటి నేల.

## ద్వితీయ వీచిక.

గీ॥ కలయఁ బరికించి యేదేని ♦ గ్రామ మొకటి
దాపునన యుండవలె నంచు ♦ తలచి కొంత
దవ్వు చనుదేర రవి నభోం ♦ తస్థుఁడయ్యెఁ
బత్తనంబొండు గాంచె నా ♦ బాటసారి.

గీ॥ కని ప్రవేశింపఁబోవఁ బ్రాం ♦ గణపుభూమి
నెదురుగా నొక్క గృహమేధి ♦ యేగుదేరఁ
బాంథుఁ డాతనిఁ గాంచి సం ♦ బరముతోడ
'అయ్య! యీయూరి పే రేమి?' ♦ యనుచు నడుగ

నతఁడు 'కళ్యాణపుర మందు' ♦ రని వచించి
'యెవ్వఁడవు నీవు, పేరెయ్యి, ♦ దెచటి కరిగె,
దేమి పనిఁబూని చనుచుంటి ♦ వెఱుక పఱుపు'
మనుచు ప్రశ్నించి మరియు ని ♦ ట్లని వచించె.

చ॥ ఘనతర సౌకుమార్యము జ ♦ గంబున నెం దసమానమైన దీ
తనువున, వీక్షణంబు సమ ♦ దంబును నిశ్చలతాకరంబు నీ
కనుగవ, హాసమాయతసు ♦ ఖప్రద మీముఖమందు గంటి యే
మని వచియింతు నీతనువు ♦ నారయు భాగ్యము భాగ్యమయ్యెరే!

ప్రణయసౌరభము.

కం॥ భీకరవన్యమృగాకర
మౌ కుధరము దాని దిశల • యందున వృక్షా
నీకాగమ్యాటవి నీ
వేకరణిన్ దాటినావొ • యేర్పడఁ జెపుమా!

శా॥ క్రూరుల్ చెంచులు మద్యముం గొనఁగ సం•శోధింప రే వేళలన్
దారుల్ దోతురు భీకరాకృతు లనూ•నస్ఫారదోశ్శక్తిమై
నారుల్ దీర్చిన విండ్లయందు శరసం•ధానంబుఁ గావించి కాం
తారంబందు చరింపఁ గాంచి మది భీ•తం బంద కెట్లుంటివో?

గీ॥ ఆలఁ గాచెడి గోపాల•బాలు రయదె
సరసకోకిలకాకలీ•సదృశమైన
గాత్రరవముల నూత్న సం•గతు లెసంగ
లీలఁ బాడెడి పదము లా•లించినావె?

గీ॥ దధివయస్తక్రములఁ బురాం•తరములందు
విక్రయ మొనర్చి, తత్కుంభ•వితతిఁ దాల్చి,
కూరి శిశువులపై ప్రేమ, • ఘోషములకు
తిరిగి చను గోపికలఁ జూచి•తే పథికుఁడ!

## ద్వితీయ వీచిక.

మ॥ జలజాప్తుండు నభోంతరస్థుఁడయి శ♦శ్వద్భానుజాలంబుచే
నిలఁ గావించెను వేఁడిమిం గలము నో♦యీ పాంథ! గమ్యస్థలిం
దలతున్ దవ్వని యీప్రయాణముడుగ♦దా తాత్కాలికైకోపచ
ర్యలఁ గావించి భుజింపఁ బెట్టెదను ర♦మ్మా సద్దయాదృష్టితోన్.

ఉ॥ పావనమైన దీదినము ♦ భవ్యసమార్చనఁ జేయ నీతిథిన్
గేవలపుణ్యసంగతము ♦ నిక్కమటంచు వచింతురు పండితుల్
గావున నాదు ప్రార్థన వి♦గర్హణముల్ రచియింపఁబోకపాం
థా! విను వెంటరమ్మిక మ♦నంబున సంతసమావరింపఁగన్.

మ॥ కమనీయామలసుప్రసిద్ధకవితా♦కాంతాప్రియంభావుకుల్
విమలోదారయశస్కులున్ ప్రథితవా♦గ్వేదాంతతర్కాదిశా
స్త్రముల న్నేర్చినపండితుల్ పురిని బె♦ద్దల్ నిన్ను మన్నింతురే
వేగమె విచ్చేయుమి పండితాదరణసౌ♦ఖ్యంబెన్న నీకయ్యెడున్.

మ॥ వరగోమేధికపుష్యరాగవిలస♦ద్వజ్రోపలవ్రాతసుం
దరకోణాష్టకసంయుతంబుగ సము♦ద్యత్ప్రాంశుదేవాలయం
బరుదై, గోపురహారియై నగరి క♦త్యంతాభిరామంబు సం
స్మరణీయంబుగఁ గూర్చు శిల్పిధిషణా♦చాతుర్యమేపారఁగన్.

ప్రణయసౌరభము.

గీ॥ అందు పద్మావతీసతీ♦హావభావ
ములకు లోనయి, కలికాల♦కలుషనిచయ
హారణకలనాధురంధరుఁ ♦ డగుచు వెలసె
భక్తపాలుండు వేంకటే♦శ్వరవిభుండు.

సీ॥ విరులను, వేంకటే♦శ్వరపూజనార్థమై
రేపుమాపును సమ♦ర్పించుచుండు
ఫలముల, నాఁకొన్న♦పాంథజనాళికి
రేయింబవళ్ళు న♦ర్పించుచుండు
లతల, విలాసబా♦లాలోకదీర్ఘ డో
లికలుగా సతత మ♦ర్పించుచుండు
బొదరిండ్ల, భూదేవ♦పుత్రవేదాభ్యాస
గృహములుగా సమ♦ర్పించుచుండు

గీ॥ పత్రముల, విప్రభోజన♦భాజనములు
గాగ నిడుచుండు సఫలతం ♦ గాంచుచుండు
పురమునకు దక్షిణతలాన ♦ వఱలుచుండు
ఘనతరోద్యానవనము వీ♦క్షుంబు పాంథ!

ద్వి తీ య వీ చి క .

గీ॥ అర్థరాజనవిస్తీర్ణ♦మై యొసంగు
నావనమునందు ధర్మశా♦లాభిధాన
హర్మ్యరాజ మంతర్గత♦మగుచు వెలయు
నతివిచిత్రాంచితమ్ము వీ♦క్ష్యమ్ము పాంథ!

సీ॥ ఎవ్వాని నామసం♦స్మృతి భవాంభోధిని
మగ్నుల కుత్తీర్ణ♦మార్గ మగును
యెవని మాహాత్మ్యసం♦శ్రవణమ్ము సత్కార్య
సాధన కౌశల♦జనక మగును
యేవాని రూపస♦మీక్షణ జపతప
శ్చరణదూరులకు సం♦స్కరణ మగును
యెవ్వాని యావాస♦దృష్టి తైర్థికచమూ
సంగతశ్రమ కుప♦శాంతి యగును

గీ॥ యెవని సేవనమున నభి♦వృద్ధి యగును
ధాన్య ధన బంధు మిత్ర సం♦తానసమితి
యాతఁడు సర్వజనాభిపూ♦జార్హుఁ డగును
భక్తపాలుండు వేంకటే♦శ్వరవిభుండు.

గీ॥ శ్రద్ధయాధీతగణితశా♦స్త్రపరిచిత
లక్షణవివేకచిత్తుఁడ ♦ బ్రాహ్మణుండ
శ్రీశనామాంకితుండ వి♦చ్చేసె మామ
కాతిథేయంబుఁ గొనుమయ్య ♦ యధ్వగీన!

చ॥ అనవుడు పాంథుఁడాతని మ♦హాద్భుతవాక్యము లాలకించి యి
ట్లనియె మహాత్మ! స్నిహితహి♦తాచరణత్వరమానసుండనై
మనుకువఁబోవుచుంటిఁ దల♦పోయుము విప్రునిగాగ నన్ను నీ
జనములు బిల్చుచుందురుసు♦శర్మయటంచు నిరంతరమ్మునన్

ఉ॥ దైవముపైన భారమిడి ♦ దారినితప్పక మిత్రికార్యదీ
క్షావినియోగబుద్ధినయి ♦ కాననమందున వచ్చుచున్న నా
కేవిధమైనభీతి జని♦యింపదు చిత్తము సంచలింప దా
యావిషమాధ్వ మల్లె యస♦హాయతలీలగ నిర్గమించితిన్.

గీ॥ మీరు నాయెడఁ జూపిన ♦ గౌరవమున
దనిసెఁ జిత్తంబు గణితశా♦స్త్రజ్ఞ! యింక
కాలయాపన సేయంగఁ♦గాదు మీఁద
నరుగవలయును కార్య మ♦త్యవసరంబు.

## ద్వి తీ య వీ చి క .

గీ॥ భావికాలజ్ఞుఁడవుగానఁ ♦ బ్రశ్న యొకటి
కలదు దానిని దయఁబూని ♦ తెలిపితేని
విందుపెట్టిన పుణ్యముం ♦ బొందఁగలవు
వేగమె వచింపుమయ్య యో♦విమలచరిత! '

మ॥ అనఁ జోస్యుండు స్వహస్తపర్వగణనం♦ బ్యానంబుగావించి యా
మునదాసాంకురముల్ జనింపఁబడియుం♦బూజ్యుల్ సుశర్మాఖ్యుని
గని పల్కెన్ 'మహనీయ! నీతలఁపు సా♦కల్యంబు సాఫల్యముం
గనెడున్ సందియమింత లేదు మొనవం♦గా రమ్ము మాయింటికిన్.

గీ॥ శ్రమఁదలంపక ధర్మ భే♦దమునఁ బోక
ఘనతరాసక్తి విడఁబోక ♦ కార్యములకు
జతన మొనరించు నరులు ని♦స్సంశయముగ
వాస్తవంబుగ సఫలతఁ ♦ బడయుచుందు్రు.'

గీ॥ అనుచు సంతుష్టచిత్తు న♦య్యధ్వనీను
వెంటనిడుకొని యిలు సేరి ♦ పెరిమమీఱ
నర్ఘ్యపాద్యాదిసత్కృతు ♦ లందఁజేసి
కుడువఁబెట్టెను సంతృప్తి ♦ గడలుకొనగ.

ప్రణయసౌరభము.

ఉ॥ అంతట తన్నికేతనము♦నందు సుశర్మ పథిప్రియాన మం
తంత నవాప్తమై వెలయ ♦ నా మెతఁ బెట్టిన నారగించి బల్
సంతసమంది శ్రీశు నెడఁ ♦ జాలకృతజ్ఞతఁ జూపి స్నేహితో
దంత మెఱుంగమిఁ మదిని♦దద్దయు యోజనఁ జేసియచ్చటన్.

గీ॥ శ్రీశముఖపౌరజనుల వీ♦క్షించి వారి
కన్నియో చిహ్నములఁ దెల్పి ♦ 'యిట్టివాని
నచట నైనను గంటిరే ♦ యెఱుఁగఁ జెప్పుఁ'
డనుచు ప్రార్థింప వారెల్ల ♦ రరయ మనిన.

గీ॥ పయనమై కొంతదవ్వేక♦పథమునంటి
చనియు శ్రీశునివలనఁ దా ♦ వినినయట్టి
కేళికాటవినిం బరి♦కించి చొచ్చె
ననుఁగుఁ జెలికానిఁ గనుఁగొను ♦ నాసతోడ.

చ॥ అతడటుసొచ్చుచున్న యెడ♦యామ్యదిశాగతమంజుమారుతో
ద్ధతపరిసారముల్ కడుము♦దంబిడుచుం జెలరేగి శాత్రుచో
దితశకునం బొసంగెను మ♦దీశుభమే యొనగూరునంచు నెం
చి తమిని ముందుపోయి కనెఁ♦జెన్నుదలిర్చెడు సౌధరాజమున్.

## ద్వి తీ య వీ చి క .

శా॥ ఆసౌధోపరిభాగమందు తనుకు♦డ్యన్యాసహ స్తద్వయుం
డై సంక్షోభితచిత్తుఁడై నిశితవీ♦క్షాలోకితోద్యానుఁడై
వాసింబాసిన యాననాబ్జమును స♦వ్యస్కంధమం దూని, పె
న్గాసిం దూలెడువానినొక్క యువకు♦న్గాంచెన్ సుశర్మాఖ్యుఁడున్.

గీ॥ అరసి నిర్భరమోదమ♦గ్నాంతరంగుఁ
డగుచు సోపానముల నంటి ♦ హర్మ్య మెక్కి
దరికి జని వేగిరమున న♦క్కరము లదర
'శ్రీధరా! సఖా!' యని కౌఁగి♦లింపఁ బోవ.

మ॥ కనుఁగోనల్ దిగునశ్రులన్ జిలుగుచో♦క్ష్మాయార్ద్రమైయొప్పఁ జూ
పనివార్యంబు నిమేషతం దనర గా♦ఢాలింగనప్రక్రియో
న్మనుఁడై దోర్యుగమెత్తి నెయ్యునిసుశ♦ర్మంబాంధునింగౌఁగిలిం
చెనుహర్మ్యస్థితుఁడై సశ్రీధరుఁడువి♦చ్ఛిన్నోరుమాంద్యుండౌగన్

గీ॥ అంత వారలు పూర్వమై♦త్రీతిరేక
మొరయ క్షణకాలమట్టులె ♦ జరపి పిదపఁ
గూరుచుండఁగ శ్రీధరా♦ఖ్యుని సుశర్మ
సేమ మడుగుచు మఱియు వ♦చించె నిటుల.

ప్రణయసౌరభము.

ఉ॥ 'నన్నును బంధుసేవకజ ♦ నంబు మొఱంగి, యగమ్యమైనయీ
తెన్నున భీతిలేక జను ♦ దెంచుటకుం గత మేమి? నెయ్యుఁడా!
త్వన్నిలయంబుఁ జూడఁ గడు ♦ దవ్వగు నిచ్చటికిప్పు డిందు నీ
వున్న కతంబదెట్టిదగు ♦ నుమ్మలికం గననేల? తెల్పుమా!

ఆ॥ నిండుచందమామ ♦ నిరసించు నీమోము
వాసిఁ బాసె, రాహు ♦ భయమువోలు
తెఱపడేమి నిన్ను ♦ వెంటాడుచున్నది
తెలుపు వేగమే సు ♦ ధీవతంస!

ఆ॥ నిన్ను గాంచనట్టి ♦ నిముసంబు దినముగా
గడపి వెదుకవచ్చి ♦ కడకు నిన్నుఁ
గంటి నిచట ముదము ♦ గంటి నీకతఁ దెల్పు'
మనిన శ్రీధరాఖ్యుఁ ♦ డనియె నంత.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీమత్పరదేవతాయైనమః.

# ప్రణయసౌరభము.

## తృతీయవీచిక.



ఒకదినంబున హాయము నే ♦ నొందు నెక్కి
యస్మదీయా ప్రబంధాత్మ ♦ రావలోక
నాభిలాషను భూరిఘం ♦ టాధ్వ మంటి
సరభసంబున వేఁబోవు ♦ సమయమందు

గగనతలమెల్ల సలిలదా ♦ క్రాంతమయ్యెఁ
గారుచీకటు లలమె న ♦ ల్గడలయందు
భయదహుంకృతి మ్రోసె న ♦ బ్దములు మెఱుపు
లోలసి కన్నుల మిఱుమిట్లు ♦ గొలిపె నంత

విధివశంబున నావాజి ♦ బెదరిబెదరి
జవనధారావిశేషపా ♦ టవను దోఁప
నూతనాధ్వంబు నంటి న ♦ న్నుఁ గొనిరాగ
ప్రబలపవనావధూతాబ్ద ♦ పటల మగుచు

ప్రణయసౌరభము.

సఖము దెలివొందె మంజుకాం♦తార మియది
గ్రొత్తతావాట మనము సం♦కుచితమయ్యె
జేవిఁ బెన్నెత్తి మిగులఁ బ్రా♦ర్థించుకొనుచు
యానజనితప్రయాసంబు ♦ నడవనెంచి
తురగముఁ దిగ్గి యందందుఁ ♦ దిరుగుచుండ
సరసమై వీనుదోయి కు♦త్సవముగాగ
చెలగి చేతనాచేతనం♦బులు గరంగ
ఘనతరమనోజ్ఞమాధురీ♦గానరావ
మాలకింపంగఁబడియె న♦య్యవసరమున.

ఉ॥ ఆ రవమెట్టిదో తెలియ♦నౌనని నేఁ జని మంజువల్లికా
గారమునందుఁ గాంచితి చ♦కోరపుఁ గుందనపుఁ సలాకనున్
గేరుశరీరముం గలిగి ♦ కెంపుపసన్ హసియించు మోవిసిం
గారము రేకులెత్తు లలి♦గానముఁ బాడు విశాలలోచనన్.

చ॥ కనుఁగొని చెంత కేగి “నవ♦కంజదళాయత నేత్ర!” యంచుఁ బి
ల్చిన పిలు పాలకించి వెన♦లేచి పయంటను దిద్దుకొంచు స
న్నని పొదమాటు జేర యెల♦నాగ, తదీక్షణకోణశాతమా
ర్గణనిచయప్రపాతననిర♦స్తధృతిన్ గడుదూలితిన్ సఖా!

తృ తీ య వీ చి క.

చ॥ ఒకయబలావరోధరమ♦ణీయాద్ధురపంజరసీమయందు మా
మకహృదయాండజంబును ప్ర♦మాదవశంబునఁ జిక్కఁజేసి నే
నకట! విమోచనోచితసు♦లైన ప్రయత్నముల నరిచింప మా
టికి విఫలత్వమందితిఁ గ♦డింది సహాయము లేమి మిత్రమా!

గీ॥ మును విలోకించినట్టి పూఁ♦బోదులందు
తవులదాయెను నాదుడెం♦దం బయారె
యూనలఁతఁ గన్నదాదిగ ♦ నందె తవిలి
మరలిరాదేమి చిత్ర మిా ♦ మాడ్కిఁ గనిన?

మ॥ తనుఁగొన్నంబులకాంతరంబులోద వె♦న్గాయంబు కంపించె దో
చెను నిట్టూర్పు దీర్ఘమై, తనువు వా♦సిం బాసె, చాపల్యముం
గొనమింబొందెను మా ననంబనఘ! సం♦కోచింపఁ గార్యంబుగా
దని నే నెంచెద నెట్టులా చెలియ నె♦య్యం బింక నా కబ్బునో?

గీ॥ ప్రేయసీమోహనైకమూ♦ర్తిని గనంగ
నగ్గలఁపు మోదమందు మ♦దక్షియుగ్మ
మితర మేమియు వీక్షింప ♦ నేవగించు
వహ్వారే! పరిణయసంబంధ♦బాంధవంబు.

పరిణయసౌరభము.

మ॥ విలసద్భారువిశాలసౌధముల నా◆విర్భూతమై కజ్జలో
జ్జ్వలమై నిద్దపుఁజక్కటద్దముల ని◆చ్చల్ గ్రీడఁగావించి ని
స్తులమై నూతనయౌవనంబునొగి వి◆స్పష్టంబుఁగావించుచున్
బొలుపుంగూర్చెడు వాలుఁజూపు దెలుపన్ ◆ బూఁబోడి భా
వార్థమున్.

మ॥ పరదేశాగరుణాపరిసారమున నేఁ◆ బాంథుండనై కాననాం
తరసీమం దిరుగాడుచుం దుదకుఁ ద్వ◆త్సంగీతమాధుర్యవి
స్ఫురణ న్వీనులఁ గ్రోలివచ్చితిని నీ◆మూర్తిం గనుంగొంటి శ్రీ
ధరనామాంకితుఁడన్ రసాదివిజ్ఞుఁడన్◆ తన్వంగి! వింటేకదే!

గీ॥ నిన్నెఱుఁగఁ జేతువేమొఁ త◆న్వీ! యనంగ
'విష్ణుశర్మాభిధానప్ర◆థీసురునకు
ననుఁగుఁగూతుర నీలఁగ◆ళ్యాణపురమె
యాలయము మాకు, పాంథుడ◆ వైతి వేని
ఎవతె పరిణయిని? నీ' కనె◆ యొయ్యదిపల్కె.

ఆ॥ ఉవిద కెంపుమోవి◆చివురూచికొని తేనెఁ
జిలుకరించు నుడులు ◆ ముఖము లగుచు
జెవులఁజొచ్చి నాదు◆చిత్తమ్మున న్నాఁటి
దిటవుబొందళంబు ◆ దివిచి చించె.

తృ తీ యా శ్వా సి క .

ఉ॥ ఆనిశ్వసోత్తి జాలవిభు◆లారయము నామది దొందడింపఁగన్
సూనవృషత్కుఁ జేసె గుటిఁ◆జూచి శరంబుల నోర్పుదక్కఁ జం
ద్రాననవోడఁ జిత్తగత◆మైన యభీష్టము దెల్పువేళ యాం
చేను దలంచి యీపొదరు◆టింటి మరుంగునఁ గొమ్మెరుంగునుం
బోనిమొయింజెలంగు చెలి◆బోహ్యద యేశ్వరి యంచు తెల్పఁగన్.

మ॥ పదయుగ్మాశ్రిత హేమనూపుర సుశ◆బ్దంబుల్ వినన్ బ్రేమయున
గ్గదియన్వచ్చి వనంబు వెల్లిగొన ని◆ష్కాపట్యభావంబుతో
"నిది నిక్కంబు బనేని యీసరముఁ గొ◆మ్మీకన్యకాత్వంబునన్
దుదముట్టింపు" మటంచు పువ్వసరము నం◆తో భక్తి నాకీయరా.

ఆ॥ అప్పు దలఁచఁ బెండ ◆ నంది మోహాంధుండ
నగుట నాకరముఁ◆దిగిచి నాదు
ముద్దుటుంగరమ్ము ◆ బూఁబోడి వ్రేలిని
బూన్చి ముద్దుగొనఁగఁ ◆ బోవు నంతఁ.

చ॥ కనుఁగవ కెంపుమీర నెఱ◆కౌనసియాడ జిలుంగుకంచుకం
బునఁ గడుపుష్టలంపుజిగి◆పుత్తడిరంగుహారంగుగుబ్బ లే
పునగుఁ యుంగఁ బైట యుడి◆వోవఁగఁ గ్రేడవ్రేళ్లు నాదుమే
నినిఁ గనుకందఁ జేయుఁ జెయి◆నెట్టననీగి ననున్ విదిర్చి తాఁ
జని దవుదవ్వుల న్నిలిచి ◆ జాణతనం బొరయంగ నిట్లనున్.

పరిణయసారథము.

గీ॥ "బలియుఁ బ్రియుండవు వాఁడవు ◆ ధర్మవేత్త
విటుల నంతర్ముఖుండవై ◆ యిట్లు నన్ను
బలిమిఁ బట్టంగ నెంచితి ◆ పాంథ! నీకు
ధర్మహాని రచింపంగఁ దగునె యనుఁడు.

శా॥ కాంతా! చిన్నతనంబుగోల వనురా◆గప్రోద్బలప్రక్రియన్
నుంత్రైనం గమనింపఁజాలని నినుం◆జూడన్ మనంబెంతయున్
జింతావేశములన్ వహించెడిని నా ◆ చెయ్వుల్ సధర్మంబుగా
నంతోషప్రీతిపాదిగా తలఁచి నన్ ◆ సంధింపవే కౌఁగిటన్.

మ॥ నినుఁ గన్నారఁగఁగాంచి నీపలుకుమ్రా◆న్కి రేజమందెంచినా
యనురాగం బెఱిఁగించితిం గఠినతా◆యత్తైకచిత్తంబునన్
ననవిల్తుండుహుటాహుటిన్ ములుకులన్◆నాపైఁబ్రయోగించెడిన్
వనితాలోకశిరోవతంసమ! ◆ ననుం బాలించ న్యాయంబగున్.

ద్విపద॥ అనుచుఁ బెద్దయుఁదడ ◆ వారీతి మిగుల
బతిమాలుకొను నాఁడు ◆ ప్రత్యుత్తరంబు
నొసఁగంగఁ దలఁతీవు ◆ నొనరించినట్టి
యాపె నుద్దేశించి ◆ యంటి నిటు సఖి!

ప్ర తీ హా వీ చి క.

మ॥ ఒకమున్నారుపచించిన న్విసవు నీ♦యూహాప్రమాదంబునే
రకయాదేశికుఁడెవ్వఁడో సుమతి! ప్రా♦రంభించిబోధించె స
ర్వకళాపాండితి దాని నంత నతివా! ♦వ్యర్థాధ్వమం దిట్టులా
రక వెచ్చించుట చెల్లునే? చలము దూ♦రస్థంబుఁ గావింపవే!

ఆ॥ అంచు నేను పలుక ♦ నాలించి బాపురే!
యనుఁగుఁ జెలులు నన్ను ♦ నరయ నిటకు
వెదుక వత్తు రిపుడు ♦ వేళాయె నిప్పటి
కరిగి రేపు వత్తు ♦ నని పలుకుచు.

మ॥ నానటన్ దిద్దినబొట్టు ఘర్మలవసం♦దోహైకసమ్మార్జన
పరిసరమ్మై కనుదోయి మూఁగు చికుర♦వ్రాతంబు దృగ్వారణో
ల్లసమై తొందరపాటుదోఁప నడలు ♦ నారిణింప వస్త్రాంచలం
బసియాడంగఁ జనెన్ వివృత్తముఖయై♦యయ్యింతిమిత్రాగ్రణీ!

గీ॥ అటుల వంచించి చోరవమ్మె ♦ కుటిలచికుర
పొదలమాటునఁ గనరాక♦పోయె నంతఁ
దెలివపోకడ మదిని జిం♦తించుకొనెడి
నాకు మోదము నిడవు వ♦న్యములు చెలుఁడ!

సాంద్రచంద్రిక మిగుల న♦సహ్యమయ్యె
బొదరుటింటను బవళించి ♦ నిదురఁబోతి
నిన్నరాతిరి, తెలవార ♦ నిదుర లేచి
తెలివరూపును మదినిఁ జి♦త్రించుకొనుచు
తెలివరాకను మదినిఁ జిం ♦ తించుకొనుచు
వేచియుంటిని నినుఁగంటి ♦ వేడ్కఁగొంటి
నిటుల నత్ర్యన్వ్యాహేంము హా♦త్రింపఁగలవా ?
యింక భారంబు నీమీఁద ♦ నిడినవాఁడ
ననవుడు సుశర్మ మిత్రుని ♦ కనియె నిటుల.

మ॥ కలశంబొందకు మింక మిత్రవర! శో♦క స్నీకు సంధింతు నీ
తలపోతన్ నెఱ వేర్తు నాకొలదియ♦త్నంబుల్ నెఱింజేతు న
త్తలిరుంబోడికి నీకు దట్టమగు నే♦స్తంబుం బొసంగింతు నా
చలికారంబెఱిఁగింతు లోకముల నా♦సింజెందివర్తించుదున్.

గీ॥ శ్రీసతీపూజనాప్తవి♦శేషబుద్ధి
వైభవుఁడవైన నీ వింక ♦ వగపుమాని
భావిభావుక కార్యార్థ♦పథక మొకటి
యల్లు మనవుడు శ్రీధరుం ♦ డనియె నిటుల.

## తృతీయ వీచిక.

ఉ॥ ఏకరణిం దలంతును ము ♦ తేగతి నా కలిఁ జూతు నింతసౌ
ఖ్యాకరమైన దేహము విర♦హానల మెట్టు భరించు? నెన్నఁడే
జేకురునే తదీయకుచ♦సీమములంగడిభాగ్య మయ్యరే!
యాకమలాక్షి సోయగము♦నందుకొ అంతయు లేదు చూడఁగాఁ

గీ॥ కరపదాననవనజము ♦ ల్గలుగు కతన
పరితతలావణ్యసరసి యౌ♦వ్వనజగంధి
యూరురంభావనీజంబు ♦ లుండు కతన
పరిధితలావణ్యభూమి యౌ♦వ్పడతియిన్న.

సీ॥ సంపూర్ణపూర్ణిమా♦చంద్రికాధవునైన
ముద్దుమోమున నొక్క♦మూలఁ ద్రోసి
యాశ్రాంతదానని♦ష్యందద్విపమునైన
యానంబునను సిగ్గు♦నందఁ జేసి
శాద్వలోపాంతసం♦చారిమృగమునైన
దృగ్జాలమున వెక్కి♦రించివైచి
వర్షాగమారంభ♦వారిప్రదమునైన
జాను కీల్జెడ నెక♦సక్కె మాడి

ప్రణయసౌరభము.

గీ॥ విపులహేమవికారకుం♦భములనైన
మెఱుఁగుఁ జనుదోయి మైమించి ♦ మేలమాడి
వెలయు నారామ యెవ్వా డి♦వ్విపినమునకు
వచ్చి తమిహెచ్చఁ గాఁగిటఁ♦గ్రుచ్చుఁ చెలుఁడ!

చ॥ మణిఖచితాంగుళీయకస♦మంచితమైన యనామికం గనుం
గొని సఖి నవ్వరే నియను♦గుం జెలులాప్తులు ప్రశ్న సేయుచో
వినివిననట్లుగా మఱుగు♦వెట్టునొ' వెట్టక నన్ను నల్వురం
దున వెలివుచ్చునో మనసు♦త్రోవలగుట్టునయందుచాలునో?

మ॥ సఖులంగూడి చరించుచుండగ మన♦శ్చాపల్యముం దారునే
"రక యేమేఁయిటులుంటివేమొ తెలుపఁగా♦రాదా వచింపంగదే?
యిక దాపంజనదే" యటంచు తను నెం♦తే వారు లాలింప న
వ్వికచాంభోజదళాయతాక్షి యెటులా♦వేళఁ బ్రవర్తించునో?

ద్విపద॥ అని భయచింతావి♦లాత్ముఁడై యటులఁ
గొంత చింతించియుఁ ♦ గూరిమి చెలిని
యానుశర్మను ప్రబు♦ద్ధాంతరంగాచ్ఛ
పాటవముదలిర్పఁ ♦ బరికించి 'హితుఁడ!

## తృతీయ వీచిక.

స్వప్రయోజన వాంఛ ♦ సరకు సేయకయు
సుఖకష్టముల మన♦స్సునఁ దలంపకయు
మిత్రప్రకృతి కుద్య♦మించు త్వాదృశుల
హితుల సందర్శనం ♦ బీ దుష్టవేళ
ప్రాప్తింపఁ జేసిన ♦ పరదేవి నంబ
గురుదయామయ నెట్లు ♦ కొనియాడ నేర్తు
మామకాభీష్టంబు ♦ మహితప్రయత్న
పూర్వకంబుగ నెట్టి ♦ పొచ్చెంబు లేక
నెఱవేరునని యెచిం♦తింతును చెలుడ!
నవ్యసుస్కంధ వి♦స్పందాదులొకట
శుభశకునంబులఁ ♦ జూపట్టుచుండె
నీతివిజ్ఞుఁడవైన ♦ నీచేత నిపుడు
పనిఁగొంట దక్క యు♦పాయంబు లేదు
యీ దక్కినవుదెస ♦ కేగినయట్టి
సకియ నీనులకు మ♦త్సందేశ వాక్య
కిసలయంబులను భ♦క్తిం గయి సేయఁ

పరిణయసౌరభము.

బొమ్మకుంటెనతనం♦బుం బూనవలసి
వచ్చె నేయని తడ♦వం బనికాదు
తిరితీపు సేయుట ♦ ధర్మంబుగాదు
కార్యసాఫల్యానఁ ♦ గడఁగు మటంచు
పలుకు శ్రీధరునకు ♦ బదులు సుశర్మ
వచియించె నిటుల సం♦బరము రేకెత్త.

గీ॥ సిస్తులామూల్యరాగ సం♦దేశవార్తఁ
ద్వదనురాగినికిం జెప్పఁ♦దగి చెలంగు
నర్తను నీవు నాయెడ ♦ నరయఁ జేసి
నట్టి యంబిక వందనీ♦యయ సతంబు.

మ॥ మునుసామీరి రఘూత్తమపరిణయసం♦పూర్ణార్యసందేశవా
ర్తనుగొంపోయి మహీజకుం దెలిపి సాం♦ద్రస్వచ్ఛకీర్తిచ్ఛటన్
గని లోకోత్తరపూజ్యుఁడై నగతి వీ♦కన్ నీదు సందేశవా
ర్తను వాకొందుమదంబికా సమును నీ♦ల స్నిఘుహా ంచెదన్.

## తృతీయవీచిక.

కం॥ అని తన యీకోర్కెల్కెన్నగ
చన శ్రీధరు నచటి యునికి ♦ శాసించి వినూ
తన పరిణయ సంధానక
లనమతి యాతండు సమత్♦లంబైన పథిన్.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీమత్సర దేవతాయైనమః.

# ప్రణయసౌరభము.

## చతుర్థవీచిక.

పలుకెంపుజిగిదించి ♦ గులికించు గుంకుమ
బొట్టు నెన్నుదుటను ♦ ముద్దుగులుకఁ
కనుదావులను జిమ్ము ♦ గొనబుఁ బూవులబంతి
నునుకీలుజడయందు ♦ నను జెలంగఁ
జికిలిజల్తారువ ♦ న్నెకఁ గొన్న చెంగావి
వలువపింజలు పదం ♦ బుల నటింప
నచ్చంపు వెలిమించు లలరించు వెండిపా
వడలద్దుదమ్ములఁ ♦ బ్రజ్వరిల్లఁ

గీ॥ దళుకురతనంబుఁ జెక్కడం ♦ బులను గొన్న
మేలిమి పసిండిగాజులు ♦ గేలుదోయి
నలర నెలదోటఁ బొదరింటి ♦ యందు నుండి
చెలువ యొక్కతె సకితోడఁ ♦ బలికె నిటుల.

## చతుర్థవీచిక.

చ॥ "కోసరికవేడ్క ముద్దుఁగొనఁ ♦ గోరి ననుంగరమంటిలాఁగున
కుసుమశరాసనప్రథిత ♦ కోమలమూర్తిని శ్రీధరాఖ్యు నే
కనరకయున్న నిప్డు దర ♦ గంట మఱుం బనిగొందునేగదా
వినవుతలంపుదోఁచి నను ♦ బేలను జేసెగదమ్మ నెచ్చెలీ!

గీ॥ భూరిరసమంజరీనామ ♦ పుస్తకంబుఁ
బఠనఁ జేసెడి వేళఁ దత్ప్రజ్ఞులవర
శ్రీధరాత్మరనుయ్యుతై ♦ చెలగి నాదు
కన్నులకు వాని రూపంబు ♦ గానఁ జేయు

ఉ॥ నావిరిదండ నంది యొల ♦ నాఁగ వరించెను నన్నటంచు మో
హావశచిత్తుఁడై యువతి ♦ నాత్మఁదలంపక జన్మనుండు దా
నావిధిఁ జేసెఁ జేయఁదగ ♦ దంచును భావివివాహకార్య దీ
క్షావధి నించి యీపగిది ♦ నగ్గలపుం బగఁ జెందితే చెలీ!

గీ॥ ఆ మనోజ్ఞాంగసౌష్ఠవం ♦ బా వెడంద
కన్నుఁగవ బెడంగా ముఖ ♦ కంజకాంతి
వానికేగాక కలదె యు ♦ వ్వారికైన?
వలచి విడుతురె భువి నెట్టి ♦ నెలఁతలైన?

కం॥ తనముద్దుటుంగరమ్మును
ఘనముదమున నాదుఁ వ్రేలిఁ ♦ గైసేసిన యా
య్యనుపమరూపుఁడు నా చే
సిన చేత నెడంద నెటుల ♦ జింతించు నొకో?

గీ॥ అలరులంగోయ గాఁగాల ♦ కరుగనేల
తరలిరాకుండఁ బొదరింటఁ ♦ దడయనేల
గీతముం బాడ మదిఁ గోర్కె ♦ కెరలనేల?
యారయ నన్నియు దైవభావాంతరములు.

సీ॥ కర్పూరంపువిడెముఁ దో ♦ రపురాగమున వాని
కందించుసిరి నన్నుఁ ♦ బొందునొక్కొ
బిగికౌఁగిటఁ వాని ♦ బ్రేమారగ వసింపఁ
జేయుభాగ్యము నన్ను ♦ జెందునొక్కొ
తమివాని చెక్కుటద్దముల మాటికి నొక్కు
సిరినాదు మునిపంట ♦ వఱలునొక్కొ
తత్పదాబ్జముల మెత్తఁగ నొత్తుభాగ్యంబు
మచ్ఛాయయుగమున ♦ మసలునొక్కొ

చతుర్థవిచారః.

గీ॥ తనివితీరని కోర్కెలు దండడింప
తను విచిత్రమ్ములైన బంధములఁ దేల్పఁ
బరవశతనొంది కనులఱెప్పల మొగుడ్చు
కలిమి కల్లనౌనో నాదు కన్నుఁగోయి.

సీ॥ చెలిమంబు, పిల్లతెమ్మెర వీచుచో వృద్ధిఁ
బొందుగాయని తలపోయలేదు
వలపు, మాగిన మావిపండ్లు భుజించుచోఁ
బెరుఁగుగాయనుచు భావింపలేదు
తలపు, లారామభూస్థలి విశ్రమించుచోఁ
బొడముగాయని తలపోయలేదు
పరిరంభణము, లతాతరుమైత్రిఁ గాంచుచో
నేర్తుగాయనుచు చింతింపలేదు

ఆ॥ కాని సకలము మది గుదిగొనిన కతన
నొక్కపెట్టునఁ బ్రబలి పైకుబుకు వరదు
శ్రీధవామలమూర్తి వీక్షించుచుండు
సఖియా! యెటులబ్బు వానినేస్తంబు నాకు?

ప్రణయసౌరభము.

గీ॥ అసవు దనుఁగుఁగత్రియు దర♦హాసచయత
రంగితాననయై హృద♦యంగమముగ
"నెచ్చెలీ! యేల చింతింప? ♦ నేఁడొ రేపొ
యాతనిఁ గవఁగూడదపు నిక్క" ♦ మనుచుఁ బలుక.

ఉ॥ ఇంతకుమున్న వచ్చి "దయిత♦యింతలతాంగులచందమేను వీ
క్షింతునుగాక వేళఁ బరి♦కించి తదీయవచస్సులం బ్రసం
గింతునుగాక" యంచు నవ♦గీర్ణగుణుండు సుకర్త యొంచి త
త్కాంతవనస్థమంజులల♦తావృతశాఖములుంగఁ జేరియున్.

గీ॥ వారిసంభాషణమ్ము స♦ర్వమ్ము వినియు
సమయ మిదె యంచు తలఁచి స♦సంభ్రమముగ
వారిపొదరింటి ముందటి♦భాగమందు
నిలుచువానినిఁ గాంచి రా♦జలజముఖులు.

చ॥ కని యితఁ డెవ్వఁడో నవవి♦కస్వరమూర్తి యిటేల కాననం
బున కరుదెంచెనో? విమల♦మూర్తిని శ్రీధరు నెచ్చెలైనఁ దాఁ
గనుఁగొనెనో యెఱుఁగఁదగు♦గా యనియెంచి లతాంగి నీల
వాని నతిథిపూజఁ దన్పి తన♦ నేర్చినచొప్పున వాని కిట్లనున్.

చతుర్థపిచిక.

ఉ॥ ఎక్కడివాఁడవయ్య యెట ♦ కేగెదు నీయభిధానమందు నే
యక్కరముల్ సెలంగెడిన ♦ నాన్వయ మెయ్యదినిన్నుఁ గాంచుచో
నక్కటికంబు నాహృదయ ♦ మందు జనించెను త్వచ్చరిత్రము
న్నిక్కముగాఁగఁ దెల్పుము మ ♦ నీషివతంస! శుభంబు నీ కగున్.

గీ॥ అనవుడు సుశర్మ యావల్కు ♦ లాలకించి
యాపె సమ్మోహనాకృతి ♦ కబ్బురపడి
"యీసతికి శ్రీధరుండు హృ ♦ దీశుఁడైనఁ
బసిడికిం దావియబ్బిన ♦ వగిది కాదె?"

గీ॥ అని తలంచి సందేశవా ♦ క్యముల సతికిఁ
దెలుపుటకు మున్న హితునిఁ గీ ♦ ర్తింపనెంచి
గురుదయాధీతసంస్కృతో ♦ ద్ధురవివేక
వాక్ఫణితి నిట్టు లారాయ ♦ బారి పలికె.

చ॥ అలరుబురంబు మోహనస ♦ మాఖ్యనొకండు ధరామరావలీ
నిలయము శ్రీనివాస మవ ♦ నీజలతాతతకేళికావనీ
కలితము పద్మసంచయవి ♦ కాసితచారుసరోవరాగతా
నిలపరిసారమంజులము ♦ నిస్తులసౌధసమంచితమ్మునై.

పరిణయసారము.

గీ॥ అందు నివసించుచుండు ని♦రంతరమ్ము
రాజరాజేశ్వరీకృపా♦ప్రాప్తనిఖిల
వైభవుండు పద్మజాన్వయ♦వార్ధిసోముం
డంబుజాంబకతుల్యరూ♦పాంచితుండు.

గీ॥ ఘనతరాంగ్లేయపాలన♦కారణమునఁ
గలిగె భాగ్యలు భూగోళచ♦క్రమునకెల్ల
దేశకాలోచితస్థితిఁ ♦ దివ్వరకున్న
జనులు నిందింతు రెట్టి స♦జ్జనుని నైన.

ఉ॥ చిన్నతనంబునం బఠన♦సేసెను వేల్పు తెలుంగు బాసలం
దెన్నికఁగాన్న శబ్దముల ♦ నెన్నిటినో యువనాంగ్లసత్కలా
భ్యున్నతిఁ బొందె నావల న♦హో యని పెద్దలు మెచ్చ బుద్ధిసం
పన్నుఁడు శ్రీధరాఖ్యుఁడు సు♦మంగళకార్యకరుండు నమ్రతన్.

మ॥ నిదురన్మేల్కొని తెల్లవాఱుటకు ము♦న్నే శ్రీరమాదేవిసన్
హృదయాంభోజమునన్ స్మరించికాలని♦న్నిత్యంబు కేళిన్ రచిం
చి దినేశార్ఘ్యము బత్తినిచ్చి గృహమున్♦ జేరన్ వెసం బోవుచో
సదనప్రాంగణరాజి నిల్చి సతు లా♦శంజూతు రాసుందరున్.

## చతుర్థపీఠిక.

ఉ॥ బాసలనంగ నేరని ◆ ప్రాణసమంబులు దత్ప్రబోధనా
యాసము లింత గానము, ప◆శ్వాంతరసీమల నిల్వఁబోవ సం
త్రాసము లేదు, నీతు లమ◆రంబుగఁ జెల్పును, వహ్నిరేయుప
న్యాసమునన్ దదాచరణ◆మందస...నుఁడెయ్యాఁదలంపఁగన్

ఉ॥ పూనిన భవ్యకార్యచయ◆ము న్విడఁబోడు జయోపలబ్ధి కెం
తేని పరిశ్రమింపడును ◆ నిక్కముమీఁతి ప్రగల్భవాక్యసం
తానముఁబల్కఁబోవఁడు ని◆తాంతదయన్ బరికించు బీదలుం
గాని మతస్థవారయినఁ◆ గాని తమంతటఁ దన్ను వేఁడఁగన్.

మ॥ కలముంబూని రచించు నేకఘటికా◆కాలాంతరాత్యంతని
ర్మలధారాయుతపద్యసంగ్రథితశో◆భత్కావ్యముల్ వాల్గుబా
నలలో, వీనులకింపుగాఁగ కృతసం◆స్కారైకగానస్వరం
బుల నిచ్ఛాగతిఁ బాడు నారసిహుఁడా◆భూదేవపుత్రుండొగిన్.

సీ॥ తనతండ్రి గడియించి ◆ దాచిపెట్టిన సొమ్ము
పదికోట్లకుం బైన ◆ వఱలుచుండఁ
దనతాత యార్జించి ◆ తీసరఁజేసిన మాన్య
ములులక్షలన్నించి ◆ యలరుచుండఁ

ప్రణయసౌరభము.

దనజిరగాండ్రు ప్రో♦బ్బిన వేడ్కఁ బాలింపఁ
పశుసంతతులు వేలు ♦ బరఁగుచుండఁ
దనతల్లి యన్నప్రో♦దాన మింటికి బంధు
వులను నూర్లకునూర్లఁ ♦ బిలుచుచుండ

గీ॥ తనపరిజ్ఞాన మార్యసం♦తానమునకు
భ్రిమలఁదొలగించి పెల్లుసం♦బరము గొలువఁ
బ్రిథితసత్కీర్తిమంతుఁడై ♦ పరఁగుచుండు
శ్రీరమాలోలచిత్తుండు ♦ శ్రీధరుండు.

గీ॥ అతని చెలుఁడ సుశర్మనా♦మాంకితుండ
వరవిరించ్యన్వవాయుండ ♦ సరసిజాక్షి!
నీవతనిఁ గేళివనమున ♦ న్విడిచిచనిన
నాఁటఁ గోలెఁ గృశించు వి♦న్ననుఁదక్క.

సీ॥ విహరింపఁబోడు స♦స్నిహితమంజులతరో
ద్యానకాంతారమా♦ర్గాంతరములఁ
జరియింపఁబోఁడు పాం♦డురపూర్ణచంద్రికా
విలసితనక్తవే♦ళలఁ గడంగి

## చతుర్థవీచిక.

వినఁబోఁడు శారికా♦పికకీరకలకంఠ
కలకంఠమంజుల♦కూజితముల
ధరియింపఁబోఁడు వి♦స్ఫురదంశుమాలికా
రమణీయపుష్పహా♦రముల మెడను

గీ॥ కటకటా! యెట్టివేళ నిం ♦ గాంచినాఁడొ
యువిదయువిదయటంచు నేను వే ♦ యనఁగనేల
సరసిజాక్షి! నీ నామసం♦స్మరణదక్ష
మాబుధోత్తముఁ డిచ్చగిం♦పఁడు జగమ్ము.

గీ॥ భవ్యతావక దర్శన♦ప్రాప్తిలేమి
నతనిమెదతమ్మి వికసింప♦దయ్యెఁ గాన
నహరహంబును వాయుహా♦ర్యముల నతఁడు
బంధనము సేయుచుండును ♦ పరవశతను.

గీ॥ నిన్నుఁ జేపట్టఁగా మది ♦ నిశ్చయించి
ఘనతరోపాయముం బొడ♦గానలేక
తరుణి! నక్తందివమ్ము ఖే♦దంబులేక
శ్రీరమాదేవి నతఁడు పూ♦జించుచుండు.

గీ॥ అతఁ డిపుడు దాల ధర్మశా♦లాభిధాన
హర్మ్యమందుండి నీకును ♦ మదిగ మఱియుఁ
దనదు మాటగ వాకొను ♦ మనుచు నాదు
కొన్నినుడులను దెల్పెనో ♦ కొమ్మ! యిటుల.

ఉ॥ 'నినువిడఁబాసినదియాదిగా నిముసముల్ ♦ నిక్కంబుగా గంటల
య్యెనుగంటల్ పరికింపజాములయి యెం♦తే దుర్భరంబయ్యెనో
వనజాతేక్షణ! నిన్నుఁ దక్క మఱిసం♦భావింప నెన్నండు త్వ
ద్ఘనబాహాపరిరంభణావృతుని న♦న్గావింపవే మ్రొక్కెదన్.

మ॥ మునునాపైఁగల ప్రేమఁ బల్కితి విసం♦పూర్ణంబుగా నంతమా
ఱినవిశ్వాసయుతుండనై యమలమై ♦ తారుణ్యమై యొప్పు త్వ
ద్ఘనలావణ్యపయోధిలోన మునుఁగం♦గా యత్నముల్ సల్పుచుం
టిని కామార్తుఁడనౌచు భవ్యగుణపే♦టీ! నన్ను కాపాడవే.

గీ॥ నిర్మలప్రేమ నీరధి ♦ నిస్తరింప
భూరిమేధావ్యయంబుఁ దెం♦పుగ నొనర్చి
సాహసాశాప్రకామహా♦ర్షములతోడఁ
దరణిఁ గట్టితి దానిపై ♦ తరలిరమ్మ!"

చతుర్థవీచిక.

గీ॥ కాన తరితీపు సేయంగ ♦ గాదు నీకు
శ్రీధరుని నెయ్యమును సమా♦ర్జింపవేని
సకియ! నీమేనఁగల యెల ♦ జవ్వనము వ
నానఁ గాచిన వెన్నెల ♦ యగునుమ్మ!

చ॥ అనుచు సుశర్మవల్క దర♦హాసతరంగతరంగితాస్యయై
వనజదళాక్షి నీల యిటు ♦ వాకొనె నాతనిఁ గాంచి "ధీవరా!
ఘనవిరహానలంబునను ♦ గ్రాగిననామది నాదు ప్రాణము
ల్దునిగుణవర్ణనోక్తుల సు♦ధోదయముఁ జల్లి శమింపఁ జేసితే.

గీ॥ చంద్రికరణాళికారుచి సం♦సర్గమొదవఁ
గువలయమునకనురాగంబు ♦ కొంచెపడునె?
యిటులె శ్రీధరు దృష్టి నా♦యందుఁ దనర
నామనంబద రేఖలెత్తదే ♦ న్యాయవిజ్ఞ!

చ॥ చెప్పెదిదేమి? నాహృదయ ♦ సీమజనించినకోర్కె యేచిన
న్నిప్పటి కిప్పుడే చని మ♦హీశుని శ్రీధరుఁ గూడుమంచు తా
జెప్పను గాని వేరొక వి♦శేషము గద్దు వివాహకార్యమున్
జొప్పడఁ దలంపరోధమయి ♦ చూడగుచున్న దిదాని కెంతయున్.

పరిణయసౌరభము.

మ॥ వరపాణిగ్రహణోత్సవావధిని నే ♦ భావించి యానాఁడు నా
కరముం బట్టినవాని జవ్వను లన ♦ త్కాంజాతపత్రాక్షు శ్రీ
ధరు నారీతిఁ దిరస్కరించి చని వి ♦ ద్యాసౌరభాఘూర్ణిత
త్పరమా మత్ప్రియబంధువర్గములకా ♦ త్యంతప్రమోదమ్మునన్.

గీ॥ ఈ యుదంతంబు బాలంబు ♦ నెఱుకపఱచు
నంత వారలు సమ్మోద ♦ మంది వేగ
మఱల నిన్నాఁకుఁ బరిణయం ♦ బాచరింప
నిశ్చయముఁ జేసికొనిరి ని ♦ ర్ణిద్రమతులు.

గీ॥ పరిధితజనుల సహాయసం ♦ రంభ మొదవఁ
గార్యనిచయాంతరాయసం ♦ గతభయంబు
లింక నెట్లు బాధించు ♦ నిదియె కాదె
యార్యకుత్సితులంద్రైన ♦ యంతరమ్ము ?

చ॥ ఉరుతరపుణ్యకార్యరచ ♦ నోజ్జ్వలితాభినవప్రభావ ! త
చ్చరణసరోజపూజనవి ♦ చారము మామకచిత్తమన్యముం
బొరయునె యెట్టిసందియము ♦ బొందకు మెల్లిశుభోదయంబగున్
దురితమె పోయి మీబుధవ ♦ తంసునకీశుభవార్తఁ దెల్పుమీ"

చతుర్థవీచిక.

గీ॥ నాపుడు సుశర్మ తత్కార్య ♦ నైపుణమున
కెంతయుఁ సంతసించి యా♦య్యింతితోడ
వెడలి వచ్చెదనని చెప్పి వెళ్ళినంత
నెలత కైదండఁ గొని నీల ♦ నిర్గమించె.

చ॥ అతడటులొంటిమార్గమునె♦యంటి వెసంగదు దాలనున్న ఆ
యతికలధౌతసౌధశిఖ♦రాగ్రితలంబున కేగి మిత్రునిం
గుతికకవుంగిలించి మఱి♦గొమ్మనుదుల్ వచియింపుచుండనా
తతమగు తేజమడగఁ బ♦తంగుడు బశ్చిమవారిధింబడెన్.

గీ॥ అటుల నారేయి వారల♦య్యతివమిన్న
గొనబుకతఁ జెప్పకొనుచును ♦ కూర్కఁజెంది
కుక్కుటంబులు గొక్కొరొ♦కోయటంచుఁ
గూయ మేల్కని పరదేవిఁ♦గొలుచుకొనుచు.

దాపునను పాఱునేటికిఁ ♦ దరలి నియతి
స్నానసంధ్యాద్యనుష్ఠాన♦నద్విధులను
దీర్చి తొలిమేడకరుగంగఁ ♦ దిగ్మభాను
డల్లనల్లనఁ దొలిదెస ♦ నవతరించె.

ప్రణయసౌరభము.

ద్విపద॥ అట నీల నిజనిల♦యంబున కరిగి
శ్రీధరాధులయున్కి ♦ జెప్పి నాప్తులకు
వారంత నాహ్వాన♦పత్రిక నొందు
వ్రాసి యిర్వురఁ బాలు♦రం బిల్చి దీని
ధర్మశాలాస్థ శ్రీ♦ధరునకొసంగి
వాని సత్వరగతి సం♦భ్రమమునను తో దారు
తోతెం దటంచు సం♦తోషప్రీతిఁ దెలుప
వల్లెయం చని పల్కి ♦ బాలు లిర్వురును
మోటారుబండి న♦మ్ముదమార నెక్కి
సరభసంబున ధర్మ♦శాలకువచ్చి
మిత్రద్వితీయుని ♦ మెచ్చి శ్రీధరుని
యాహ్వానపత్రిక ♦ నర్పించునంత
నతఁడు దానిఁబఠించి ♦ హర్షంబువిరియ
వారి సన్మానింపఁ ♦ బాలు లిట్లనిరి.

ఉ॥ "జాగొనరింప నేల యిఁక ♦ సజ్జనసత్తమ! శ్రీధరా! త్వదీ
యాగమనంబు నెంచి మొదు♦రారయుచుండ్రు వివాహకార్యదీ
క్షాగతపౌరబంధు హితు♦లందఱుఁ గాన మోటారుబండిలో
వేగమె కూరుచుండుఁ డది♦వేళజవాంచిత మిద్ది" నావుడు న్.

## చతుర్థపీఠిక.

గీ॥ శ్రీధరుఁడు నీలమతిఁ బ్రార్థించి మించి
తనమనోభీష్టకార్యసంధానమునకు
మాలకారకుఁడౌ తన ముద్దుచెలినిఁ
గాంచి దృష్టుల సంజ్ఞఁ గావించుకొనుచు

కోరికలు రేఁకలెత్త మోటారునందు
గూరుచుండెను విప్రులఁ గూడి, పిదప
బయలుదేరెను మోటారు బండివడిగ
గూర్మిచెలికాని సైగను గుర్తెఱింగి.

ఉ॥ వేగజితానిలంబును నవీనవయోవిభవోజ్జ్వలంబు న
శ్వాగమభవ్యలక్షణసమంచితముం గమనప్రభేదశి
క్షాగణనీయభావశుభగంబు శకోద్భవముం సితాశ్వముం
బొగడుపాటనెక్కి చనె మానధనుండు సుశర్మదానితోఁ.

గీ॥ అంత నతివేగమునను కళ్యాణపురముఁ
జేరవచ్చెడి వారిని వీక్షించి విష్ణు
శర్మ తనవెంట బందుగుల్ సాగిరాగ
శ్రీధరాదుల కెదురేగి సేమమడిగి

సబహుమానమ్ముగా వారి ♦ సత్కరించి
ప్రథితమంగళవాద్య ని♦స్వనము నెఱయ
ఛాందసుల్ స్వస్తిపాఠముల్ ♦ చదువుచుండఁ
దోడుకొనివచ్చి భూషిత♦తోరణమునఁ

దన నికేతనమునను శ్రీ♦ధరుని విడిచెఁ
బెండ్లికొమరుని కనులకు ♦ విందుగాగఁ
గాంచి నీలకుదగు మనః♦కాంతు డనుచు
నచటి యాబాలగోపాల ♦ మలరె నపుడు

పూర్వపరిచయ విజ్ఞాన♦ములు సెలంగ
శ్రీశుఁడు సుశర్మ కలసి భా♦షించుకొనిరి
పిదప శ్రీశుండు లగ్నంబు ♦ గదిసె ననుచు
గంకణముల వధూవర♦కరములకును

గట్టె నభ్యంగనాది మం♦గళవినోద
విధుల యాభ్యంతరము దీర్చి ♦ వెలది లేచి
వారల నలంకరించి ర♦ప్పట్టునందు
ముదము దళుకొత్తెఁ బ్రతిజీవి♦మోమునందు.

## చతుర్థవీచిక.

మ॥ అనుగుంజుట్టలు రా వధూవరులనూ♦నానందకౌతూహలో
న్మనులై మంగళవాద్యరావము పురిం♦మార్మ్రోయ శ్రీవేంకటే
శుని దేవాలయమంటపస్థలికి బల్♦సొంపారు మోటారులోఁ
జని రాఁ బోకడ చూచువారలకు నా♦సాదించె సమ్మోదమున్.

గీ॥ చని పురోహితనిర్దిష్ట♦సాంద్రభద్ర
పీఠము లలంకరించిన♦పిదప బుధులు
మంత్రపూర్వకములఁ గొన్ని ♦ తంత్రములను
నడపి రంతఁ గళ్యాణల♦గ్నంబు గదిసెఁ

బసిఁడి కమ్మ నెనఁగు మధు♦పర్క మొసఁగి
శ్రీధరుని కోమలాంఘ్రిరా♦జీవములను
చలువపన్నీటితో విష్ణు♦శర్మ కడిగి
కోరి యాతనికిం గన్య ♦ ధారవోసె.

చ॥ గొనములఁ బ్రోవు శ్రీధరుఁడు♦గొమ్మ గళంబున నంబికావదా
ర్చననిపుణమ్ములౌ తనక♦రమ్ముల మంగళసూత్ర మేచి క
ట్టినతఱిఁ దోఁచె గ్రొత్తగఁగ♦డిందివికానమపూర్వమాపె మో
మున జెలియుందదీయగళ♦ముంగ [illegible] సె సెనుపుష్పమాలచేఁ

సీ॥ తలఁబ్రాల బళ్ళెర ♦ మ్ములఁ దెచ్చి వారికి
రుకులంతుల నునిచె ♦ సకియ యోర్తు
పెండ్లికూతురు చెవిం ♦ బినవిన్నగా రహ
స్యపుమాటలం దెల్పె ♦ నలివ యోర్తు
"అలఘుధీచాకచ ♦ క్యముఁ జూపవలెనీల"
యని పల్కె జంద్రబిం ♦ బాస్య యోర్తు
"అటవిలో మగనిఁ ద్రో ♦ యుటనైన పోడిమి
వ్వాడు సూపుమీ" యనె ♦ ముగుద యోర్తు

గీ॥ "కోరి వరియించుటందైన ♦ గొప్పఁదనము
నిపుడు వెలిజేయవే" యనె ♦ యింతి యోర్తు
"కులము పరువున కీసుమంత ♦ కొఱఁతలేక
మెలఁగవలె నీల!" యనిపల్కె ♦ నెలఁత యోర్తు.

గీ॥ ఇటుల ముత్తైదువులు హెచ్చ ♦ రింపుచుండ
ముసిముసినగవు మోముల ♦ మోసులెత్త
నొండొరుల మించు కోరిక ♦ లుప్పతిల్లఁ
గొనరి తలఁబ్రాల వేఁ బోసి ♦ కొనిరి వారు.

## చతుర్థపీఠిక.

చ॥ తమపతి వేంకటేశ్వరుల◆ధౌతసుధామలపాండురాంశుమ
త్సదనముఁ జుట్టివచ్చి నవ◆దంపతు, లాప్తహితానుజీవికుల్
ముదమున వెంటరాఁగ గృహ◆మున్వెసఁ జేరిరి వారికై దువుల్
సదమలరుచ్యభోజ్యముల◆సంతతి నామెతఁ బెట్టి రాదటన్.

గీ॥ భోజనానంతరమునఁ గ◆ప్పురపువిడెము
లొకరికొక్కరు లీలమై◆నొసఁగికొనిరి
దంపతులు, వారి కారేయిఁ◆ దర్షమార
శోభనంబయ్యె నత్యంత◆వైభవమున.

గీ॥ అచ్చట ద్విరాత్రములు నిద్ర◆లైనపిదపఁ
గోరి కామించినట్టి యా◆కొమ్మతోడ
ననుఁగుఁ జెలికానితోడ హ◆యంబుతోడ
నిజపురికి శ్రీధరుండు వే◆నిర్గమించె.

ప్రణయసౌరభము.

గీ॥ నాఁటఁగోరి నామిథునము ♦ నవ్యనైక
భోగభాగ్యానుభవములఁ ♦ దోఁగితేలి
ప్రణయసౌరభవాసిత ♦ ప్రథితచిత్త
మగుచు కాపురముంజేయు ♦ నలరి ముదము.

శ్రీ. శ్రీ. శ్రీ.





For Copies apply to

***Hari Ramalinga Sastri,***

**KALAVAPAMULA,**

**KATUR POST,**

**Kistna Dist.**